భగవాన్

# శ్రీ సత్యసాయి సూక్తిముక్తావళి




కృతికర్త

డా॥ మోడేకుర్తి వేంకటసత్యనారాయణ, M.A., Ph.D.

తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు

భగవాన్

# శ్రీ సత్యసాయి సూక్తిముక్తావళి

M.V. సత్యనారాయణ
26.9.96.


కృతికర్త

డా॥ మోడేకుర్తి వేంకటసత్యనారాయణ, M.A., Ph.D.

తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు

DR. M.V. SATYANARAYANA
M.A., Ph.D.
Telugu Department
Andhra University

Waltair
12-9-1984

# కృతజ్ఞతలు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు తమ ఉపన్యాసములలో సందర్భాను సారముగ ఉపయోగించుచున్న అంగ్లసూక్తులను 'Indian Culture and Spirituality' అను తమ గ్రంథములో చేర్చి ప్రచురించిన Smt. Sakuntala Raghavan (Prasantinilayam) గారికి నా కృతజ్ఞతాభివందనములు. ఆ సూక్తులను తెలుగులో పద్యరూపమున వ్రాయుమని నన్ను ప్రశాంతినిలయములో తే 1-1-1983 దీని కోరిన నా ద్వితీయ పుత్రిక కుమారి ఎం. సుబ్బలక్ష్మి (III B.A. Class, Sri Satya Sai Institute of Higher Learning, Anantapur) కి నాఆశీస్సులు. ఈ శ్రీ సత్యసాయి సూక్తిముక్తావళిని ప్రచురించుటకు భగవాన్ బాబాగారు బృందావనం White Field, Bangalore Dist.లో, తే 1-5-1984 దీని అనుమతించినందులకు వారికి నాసాష్టాంగదండప్రణామములు. నేనుకోరినవెంటనే, ఈపుస్తకమును చదివి తమ అభిప్రాయములను రచించి యిచ్చిన ఆచార్యులకు, శ్రీసత్యసాయి భక్తులకు నాకృతజ్ఞతాపూర్వక నమస్కారములు. ఆంధ్రవిశ్వ విద్యాలయప్రచురణాలయములో ఈ గ్రంథమును ముద్రించుటకు అనుమతినొసంగిన ఆచార్య కోనేటి రామకృష్ణారావు, D. Litt., Vice-Chancellor, Andhra University, Waltair గారికి నా హృదయపూర్వక నమస్సుమనస్సులు.

ఈ గ్రంథ ప్రచురణమునకై తమంతట తామే అవసరమైన ద్రవ్యమిచ్చిన శ్రీసత్యసాయి బాబావారి భక్తులు శ్రీ తోపల్లి జగన్నాథం, B.A., B.Ed., Junior Assistant School Inspector's Office, G. Madugula, Vizag Dist, గారికి నా కృతజ్ఞతలు. వీరికి సంగీత సాహిత్యముల యందు అభిరుచి, ఆధ్యాత్మికసాధనమునందు దీక్ష కలవు. వీరి పితామహులు శ్రీ వెంకటరెడ్డి అవధానులు గారు వేదపండితులు. వీరి తండ్రిగారు వెంకట వరాహ లక్ష్మి నరసింహం గారు, M.Sc. కోయంబత్తూరు వ్యవసాయ పరిశోధన కళాశాలలో ఉన్నత పదవి నలంకరించిరి.

అనతికాలములో ఈ పుస్తకమును ముద్రించి యిచ్చిన శ్రీ జి. మదన్‌రాజు, Dy. Director గారికి, శ్రీ యస్.పి. ఎంబార్, Asst. Director గారికి ముద్రణాలయ సిబ్బందికి నాకృతజ్ఞతలు తెలుపుచున్నాను.

— మోడేకుర్తి వేంకటసత్యనారాయణ

# కృతిసమర్పణము

సీ. శాస్త్రవిహితము లౌసత్కర్మలను జేయ
శక్తిచాలదిపుడు సజ్జనులకు
బుద్ధిహీనులవల్ల పుణ్యపూరుషులకు
హానికల్గుచునుండె నవనిలోన
ధర్మకర్మములందుఁ దగుశ్రద్ధలేనట్టి
పాలకుల్ ప్రజలను బాధపడరె
విద్యయు విభవంబు వేయిరెట్లున్నను
వ్యసన తత్పరులకు వ్యథయెకలుగు
అట్టిజనులఁ గావ నవతరించితి సత్య
సాయిబాబ! కలినిశాంతి నొసఁగ
సర్వదేవమయుడ! సర్వాత్ముఁ డవునీవె
సర్వదేహములందు సంచరించి
సర్వదేశజనుల సకల చేష్టలనెపుడు
సాక్షివైయెఱుగుదు శాశ్వతుఁడవు
స్థూలదేహముతోడ సూక్ష్మదేహముతోడ
దర్శనంబిడుదువు ధరణిలోన
నిన్ను నెఱిఁగియున్న నిన్నెఱుఁగకయున్న
మనుజకోటినిఁ గావ మహిమఁజూపి
సత్యధర్మప్రేమ శాంతిరూపుఁడవౌట
సంఘసేవయొనర్చు సర్వులకును
సత్యసాయీశ్వర! శాంతిసుఖములిచ్చి
కలియుగదైవంబ కావుమెపుడు
సూక్తిముక్తావళి శుభముచేకూర్పగా
రచియింపఁజేసితి రమ్యరూప!

ఆ.వె. నీదునుడులె యివ్వి నీవె గైకొమ్మ యీ
కృతిని; సాయితత్త్వకృతిని భక్త
తతికిముక్తికల్గు; ధర్మరక్షకుడవు
సతతము మముఁ బ్రోవు సాయిదేవ.

—మోడేకుర్తి వేంకటసత్యనారాయణ



# భగవాన్
# శ్రీ సత్యసాయి సూక్తిముక్తావళి

ఆ. వె. 1. లెమ్ము! మేలుకొనుమ! యిమ్ముగా సాయి సా
మ్రాజ్యమవని సుజనభోజ్యముగను
స్థాపనంబుచేయ సత్యధర్మ ప్రేమ
శాంతి చయముపైని సాయి భక్త!

2. సర్మమేక మనెడి సత్యంబు గ్రహియించి
సర్వజనులయెడల సమతనుండు
విశ్వమంతయొకటె విశ్వహితము కోరి
సాటి మానవునకు సాయపడుము.

3. మసలుచుండు మెపుడు మంచిగా జగతిలో
మంచి చూడుమీవు మంచిచేయు
మంచి మార్గ మదియె మాధవుఁజేరఁగా
సత్యసాయిసూక్తి సర్వహితము.

4. ధనము వచ్చుచుండు ధనము పోవుచునుండు
నీతి మార్గముననె నీవు నడచి
త్యాగ ధనుఁడ వైన ధన్యత గాంతువు
నిత్య సుఖిని జేయు నిన్ను నీతి.

5. నీతితోడ నీవు నిత్యంబు జీవింప
నీతి యొసఁగు నీకు నిత్యసుఖము
పూర్ణజీవిత మిలఁబొందెద వప్పుడే
సఫల మగును నీదు జన్మ మిలను.

6. కాలము హరియించు ఘనుల నైనను మఱి
కాలహరణ చేయఁ గల్గు హాని
జీవితంబు వ్యర్థ జీవితంబగుఁ గాదె
కాలము వృథచేయఁ గనవు ఫలము.

7. ఈ క్షణంబు నందె యేమంచి పని నైనఁ
జేయ నుత్తమంబు; చేయవలదు
కాలహరణ మింకఁ; గడచిన కాలంబు
మరల రాదు; తెలియఁ దరమె? భావి.

8. ఆత్మవిదులభాష యగును నిశ్శబ్దమే
యందు వినఁగఁ జెల్లు నమరవాణి
మది లహరుల ధ్వనిని మహిత నిశ్శబ్దమే
యణచి వినఁగ నిచ్చు నమరవాణి.

9. కలలు కనుటలోనె గడపక కాలంబు
బ్రహ్మ మరయ జీవభావ ముడుగు
మనుజ జన్మమందె మాధవుఁ గాంచుమా
సత్యసాయి సూక్తి సర్వహితము.

10. మాయలోఁ బడకుమ ! మాయాజగముఁజూచి ;
ఆత్మ శాశ్వతంబె, యరయు మదియె
చరమగమ్య మదియె పరమ సత్యంబును
అంత మాది లేక యట్లె యుండు.

11. 'బ్రహ్మ మెఱుఁగు వాఁడు బ్రహ్మమేయగు' నను
వేదవాక్కు మనము వినమె భువిని
'బ్రహ్మ' పదము 'దేవ' పదమునా పరమాత్మ
శబ్దవాచ్య మంద్రు శాస్త్రవిదులు.

12. లౌకికాభివృద్ధి లౌకిక భోగము
లనుభవించుటకయి యవనియందు
జన్మమెత్తలేదు జనుఁడ ! నిక్కము గాను
ఆత్మ నెఱుఁగ యోగమభ్యసింపు.

13. దేహి మనుజుఁ డౌనె దేవాత్మరహితుఁడై
దేహి యంశలేని దేవుఁడుండు
దేహమందె యున్న దేవునిఁగాంచుమా
సత్యసాయి సూక్తి సర్వహితము.

14. సర్వజీవులందు సర్వదాయుండెడి
దివ్యతేజము గన దీక్షవూను
మదియె యంతరాత్మ యదియె దైవంబును
సత్యసాయిసూక్తి సర్వహితము.

15. ఈ చరాచర మగునెల్ల జగతియందు
నిమిడియున్నదయ్య ! యేకత మరి
దానినెఱుఁగు వాఁడె తథ్యంబుగా నొందు.
పరమ సుఖము శాంతి భద్రముగను.



16. (క) అన్ని మతము లరయ నాయొక్కగమ్యము
ననఁగ నొక్క దేవునట్టె చేర్చు
మార్గములని వాని మర్మ మెఱుఁగఁదుల్య
గౌరవమును జూపు ఘనుఁడ వౌదు.

(ఖ) మతములన్ని నీదు మనసును శుద్ధిగా
వించు కొనియె నీకు వేద్యమయిన
నీదు నాత్మ నీవె నేర్పుతో నెఱుఁగఁగా,
ప్రేమ పెంపొనర్పఁ బ్రీతిఁ దెలుపు.

17. నీవె సత్యమంచు నిజముగా నెఱుఁగుము
పగలు చూచునదియుఁ బగటి కలయె
గాఢనిద్రయందుఁ గాంచినయదిరాత్రి
కలయె గాని నిజముకాదుసుమ్మ

18. నీదు హృదయ మందు నిత్యముండెడి బ్రహ్మ
మంతరాత్మసాక్షి యగును నెప్డు
నెచటొ దైవముండె నేమిచేయు నటంచుఁ
దాచ లేవు పనిని దాగ దదియు

19. (క) అఖిలజీవులందు నధివసించెడి యాత్మ
దేవుఁడనిరి నాఁడు దివ్యమునులు
మానవునకుఁ జేయు మంచిసేవయె, మాధ
వునకుఁ జేయు పూజ, పుణ్య మొసఁగు

(ఖ) అట్లె మానవునకు హానిచేసిన లేక
దూషణంబు సేయ దోషమగును
తథ్యముగనవియె దైవహానిగ, మరి
దైవదూషణముగఁ దనరునయ్య !

20. మంచి చెడుగు ; శాంతి మానసికవ్యథ ;
సుఖము బాధకలుగు చుండునీదు
నంతరంగమందు ; నావిర్భవింపవు
నీదువెలుపలనవి, నిజముగనుము

21. అంతరంగము దెస నాత్మాభిముఖముగా
మనసు త్రిప్పికొనుము మహిమగనుము
శాంతినొందియెప్డు సమభావయుతుఁడవా
నందమగ్నుఁడవగు నరవరుండ !

22. మంచిచెడ్డలైన మరిసుఖదుఃఖముల్
ద్వంద్వములుగ జగతిఁదనరుచున్న
నొక్కనాణెమునకె యొప్పెడిరెండుము
ఖంబులవియె నిజము గనుము మదిని

23. మోదఖేదములకు మూలహేతువునెప్డు
మనసెయండ్రు పూర్వమౌనులెల్ల
బంధమోక్షములకుఁ బరగఁజిత్తమెమూల
కారణమనినారు జ్ఞానధనులు

24. తథ్యముగను రెండుదశ్శలు బాధకులేని
యప్పుడు కలుగునె సుఖానుభూతి ?
సుఖమనంగ రెండసుఖములకు నడుమ
నౌవిరామ మనఁగ నరయు మీవె

25. పరుల కొఱకు మేలుబాధ్యతతోఁజేయఁ
గష్టనష్టములును గలుగ,వాని
ననుభవింపుమప్పు డరయుము నీతోడ
దైవమున్నయట్లు ధర్మపరుఁడ !

26. ఎద్దిబోధచేయు నేకత్వమును ; స్వార్థ
రహితుఁబ్రేమకలితు మహినిఁజేయు
నదియె సత్యమైన యాధ్యాత్మికంబగు
జీవితంబు మనకు శ్రేయమొసఁగు

27. (క) ఘనులు నేర్పుతోడ జ్ఞానదుగ్ధంబును
మంథనంబుసేసి మహినిగనిరి
విశ్వహితకరంబు వేదాంతనవనీత
మదియె సాధకులకు నభయమొసఁగు

(ఖ) విద్యలందు బ్రహ్మవిద్యయే సద్విద్య
దానినెఱుఁగు వాఁడు ధరణియందుఁ
బరమ సత్యమెఱుఁగుఁ బ్రాజ్ఞుడై సర్వంబు
నెఱుఁగగలఁడు తానె నిక్కముగను

28. నీవుచేయుపనులు నీదునాలోచనల్
తిరుగనవియె రూపు దిద్దుకొనును
అవిప్రతిక్రియకును నవి ప్రతిధ్వనికిని
కారణములు మంచిఁ గాంచనెంచు



29. తెలిసియో తెలియకో దినదినంబొనరించు
మంచిచెడ్డ పనులు మంచిచెడ్డ
ఫలములిచ్చు ; మంచి ఫలమునుగాంచగా
మంచియే సలుపుము మనుజ వరుఁడ !

30. నరుఁడ ! జీవితంబు నడువదొక్క సరణిఁ
జేతనున్న దైనస్థిరముకాదు,
ఇచ్చిపుచ్చుకొనుట యిచ్చతోఁజేయఁగా
సిద్ధపడుము మంచిబుద్ధితోడ.

31. ప్రేమ నిలుచునెపుడు ప్రీతితో నిచ్చుటన్
మిన్నయౌనదే క్షమించుచుంట ;
ఆత్మ నిలుచు నెప్పు డనుభూతి పొందుటన్ ;
విస్మరింప వ్యథను భీతి లేక

32. నీ మనస్సునుండి నిర్మలభావనల్
వెలువడవలెఁ గూర్ప విశ్వహితము
పలుకుము ప్రియ సత్యభాషణంబులు నోట
చేయుమా పవిత్ర చేష్టలెపుడు.

33. ఒరులు మెచ్చునట్టి యుత్తమ జీవిత
మవనిఁ గడుపు వాఁడె యహమునుండి
బ్రహ్మము దెసకట్టె పయనించువాఁడని
బుధులు పుణ్యపురుషుఁ బొగడు చుంద్రు.

34. ప్రేమ గాంచవచ్చుఁ బ్రేమయనెడి సులో
చనములను ధరింపఁ జక్కగాను
ప్రేమ రూపసాయిఁ బ్రీతితోఁ గాంతువు
ప్రేమ మయము జగము స్వామిమయము.

35. ఎట్టి పనినిఁ జేయనట్టిదే నీకగు
ననుచు మదినిఁ దలప న్యాయముగను
చెడ్డపనులు చేయఁ జిత్తమొప్పదు నీకు ;
పరులకొఱకు మంచిపనినిఁజేయు.

36. క్షితిని మొట్టమొదట సేవకుండవుగాక
నాయకుఁడవుకావు నమ్ము నిజము.
చిత్తశుద్ధితోడ సేవచేసిన వాఁడె
నాయకుం డగుటయె న్యాయమార్య !

37. నీవెఱుగుదువేని నీవుచేసినతప్పు,
అదియె జ్ఞానమునకు నాదిసుమ్ము,
ఒప్పుచేయు వాఁడె యుత్తముఁ డిలలోన
జ్ఞానియైన వాఁడె గాంచు ముక్తి.

38. ఒక్కవ్రేలితోడ నొరుని దోషముఁజూపఁ
దలతువేని మూడుతప్పు లతఁడు
ముచ్చటగను జూపు మూర్ఖుఁడ! నీలోనఁ
గాన నీదు తప్పు గనుము మొదట.

39. ఆచరించిమొదట; నన్యుల కుపదేశ
మీయవయ్యె పిదపనెప్పుడైన
పరులలోని తప్పు పరగఁగాంతు వదియె
చేయకూడ దీవె చిత్తమునను.

40. (క) నీదు తప్పు నెవఁడు నెమ్మదిగాఁ జూపు
నీకు వంద్యుఁ డతఁడు నిక్కముగను
పరులపైపె త్రిప్పు భవదీయనేత్రముల్
నీదు లోని తప్పు నెట్లు చూచు

(ఖ) కామరోషములును గర్వాంధకారంబు
కలుషితం బొనర్పఁ గనులు మూత
పడగఁ గాంచలేవు భవదీయ దోషముల్
పరుల తప్పె నీవు పలుకు దెపుడు.

41. సత్పురుషులతోడి సాంగత్యమదియె, స
త్సంగ మవసరంబు; సద్గుణాలు
సత్ప్రవర్తనయును సమకూడు నచ్చట
సాధన సతతంబు సల్పుమచట.

42. (క) పూర్వభవములందుఁ బుణ్యపాపములను
నెన్నొ చేసియుంటి వెఱుగవీవు
నీదు పుణ్యపాప నివహంబు నేర్పుతో
మాలగానుగూర్చి మాధవుండు

(ఖ) నీదె నీ కొనగగ నీవు నద్దానినే
గళము చుట్టు గలిగి కర్మఫలము
నవని ననుభవింపనందితి భవము; నీ
పుణ్యపాపఫలము పొందుదీవె.



43. దుష్టకర్మమెపుడు శిష్టఫలములీదు
శిష్టకర్మ మీదు దుష్టఫలము
నీవు నాటు విత్తు నియతితో వృక్షమౌ
పెరుగుచుండు చెట్టువిత్తుకతన.

44. (క) మరల జన్మమంద మనము పుట్టుటలేదు
బ్రహ్మము మనమూలపదము నిజము
ఎచటనుండి మనము నేతెంచియుంటిమో
యచటికే చనుటయు నార్షమతము.

(ఖ) బ్రహ్మమందుఁ బుట్టి బ్రహ్మమందుఁ బెరిగి
యందె లీనమగుట యందఱికిని
పరమగమ్యమగుట బ్రహ్మపదమొకటె
జీవితాంతమందుఁ జేరఁదగును.

45. బ్రహ్మమెపుడు నీకు బాహ్యమందున లేదు
దైవమనిన బ్రహ్మమై వఱలును
నిజము బ్రహ్మమెపుడు నీలోన నున్నదే
యదియె యాత్మ దాని నరయు మిపుడె

46. నీవు నీజగమున నివసించినను నెట్టి
హాని లేదు సత్యమరయు మీవె
నిలువనీకు జగము నీలోననెన్నడు
సత్యసాయి సూక్తి సర్వహితము

47. దివ్యచిత్తమందు దేవుని నెలకొల్పు
త్యాగపూత దేహదళము నందు
మంచి భావఫలము లుంచు నీవైన యా
నందబాష్పములును నమ్రమతిని

48. (క) మనసునందె పూజ మాధవున కొనర్పు
మదియె యథిష్ఫలము నట్టె యిచ్చు
నీవయిన సుగంధ నిర్మలగుణముల
నర్పణంబు సేయు మతని కిపుడె

(ఖ) నమ్రభావమొప్ప నపరాధములనెల్ల
తలఁచి వగచి యిమ్ము దైవమునకు
నీదు సుగుణములను; నిన్ను నీ వెఱుగఁగా
గంటితడిని గడిగి గారవమున.

49. దైవశక్తి యందుఁ దనరు విశ్వాసంబె
చక్కనైన బాట సాధకులకు
అట్టి దారిఁబోవ నాధ్యాత్మిక విజయ
మందఁగలఁడు జనుఁడు మాన్యుఁ డగుచు.

50. భక్తియొక్క స్థాయి భగవంతుఁ డెఱుఁగుటన్
భక్తియందె ప్రేమ పరగఁజూవు ;
భక్తికె వశుఁడౌను భగవంతుఁ డెప్పుడు
జ్ఞప్తియుంచు కొమ్ము సత్యమిద్ది.

51. (క) సర్వవిషయములును సర్వేశ్వరేచ్ఛకు
వదలివేయు మదియె పరమభక్తి
నాణ్యమయినది శరణాగతి భక్తియే
సత్యసాయిసూక్తి సర్వహితము

(ఖ) లాభనష్టములను లక్ష్యపెట్టక నీవు
కష్టసుఖము లెపుడు కల్గుచున్న
నిశ్చలముగ నమ్ము నీయిష్టదైవమున్
సత్యసాయిసూక్తి సర్వహితము

(గ) మంచిపనిని జేయ మంచియే చేకూరు
చెడ్డ ఫలిత మబ్బుఁ జెడ్డ పనికి
దైవదత్తఫలము ధర్మ సమ్మతమౌట
ననుభవింపవలయు నవని జనులు.

52. కాంచు దైవకృపను కరుణామయుఁడుస్వామి
భక్తివలనఁ గరుణ బడయ వచ్చు
రవికిరణములట్లు రాజిల్లు పరమేశు
కరుణయంతటయును గాంచుమయ్య

53. శ్రద్ధ భక్తి రెండు చక్కనిసాధనల్
జీవితంపు నౌక చేర్పనొడ్డు
సరిగ పడవనడుప సంసార సాగర
తీరమవియె చేర్చు ధీరవరుని

54. (క) ఇంద్రియంబు లెన్నొ యిక్కట్లు కలిగించు
మర్కటంబు మాడ్కి మనసు కూడ
విషయలోలుఁ జేయు వివిధగతులవాని
నణచి దేవ పదమునందుమయ్య



(ఖ) మునులు శమమువలనఁ దనువు నింద్రియములన్
వారెదమము వలన వారిచిత్త
మదుపు లోనఁ నుంచి మాన్యయశులు తుద
కాత్మ తత్త్వ విదులు ఘనులు నైరి

55. (క) మనసు దేవతత్త్వ మగ్న మైయున్నచో
నైహికమగు కర్మ లాచరించు
చున్న నంతరాయమెన్నడు నొందక
ముక్తి నొందఁగలవు భక్తిపరుఁడ !

(ఖ) మనసుతోడ నైన మరికరంబులతోడ
తనువు తోడనైనఁ దనరు నెద్ది
చేయఁగలవొ, దాని శ్రీ పతికర్పింప
భోగమోక్షములను బొందఁగలవు

56. భవములందు మనుజ భవ మతిదుర్లభం
బట్టిపుణ్యలబ్ధ భవమునందుఁ
బశువువలెనె నీవుమసల మనుజజన్మ
దైవదత్తవరము దండుగగును

57. (క) ఆత్మవంక చూడనంతర్ముఖంబుగఁ
ద్రిప్పబడిన మనసు దివ్యసుఖము
ననుభవించుఁ గానఁ గనవు భేదంబును :
కష్టసుఖము లీవు గాంచునపుడు

(ఖ) సమతతోడనుండు సమబుద్ధియె సమాధి
సమతగాంతు వీవు సర్వమందు
దైవమందుఁ గూడఁ దప్పక లీనమై
నిజసమాధియందు నీవెయుందు

58. నిత్యజీవితంబు నియమబద్ధమొనర్చి
పాపభీతికల్గి పనులుచేయ
దైవప్రీతియుండఁ దప్పక శాశ్వతా
నందమందఁ గలవు న్యాయశీల !

59. దైవదత్తబలము దైవబలం బండ్రు
ధర్మ లబ్ధబలము ధర్మబలము
ధర్మబలములేని తనబలంబంతయు
ఫలరహితమె యగుసు ప్రాజ్ఞవర్య !

60. సత్యవాక్కు పలుకు సతతంబు ధర్మంబు
నాచరింపు మనెడి యార్షవాక్కు
జీవితంబునందు స్థిరలక్ష్య మైనచో
నందతెపుడు వృద్ధినందఁ గలరు

61. ధర్మ రక్షణకయి దైవమవతరించు
ధర్మమున్నచోట దైవముండు
దైవమున్నచోట తథ్యంబు విజయంబు
విజయమొందు విశ్వ విభునికరుణ

62. గ్రహగతులను బట్టి కష్టముల్ కలుగవు
దైవకృపను గాంచు ధార్మికునకు ;
దైవకృపనుగాంచఁ దప్పకప్రార్థించు ;
ప్రేమ యుక్తభక్తి వీడకెపుడు.

63. పిల్ల యేడ్పు వినుచుఁ బ్రేమతోఁ దల్లియే
పరువులెత్తి కాచుఁ బాపనపుడె
అట్లె భక్తుని మొఱనా లకించుచు దైవ
మెచట నున్న నతనినచటఁ బ్రోచు

64. (క) శిష్ట హేతుబద్ధ చేష్టల నవతార
పురుషుఁ డెపుడు చేయుఁ బుణ్యబుద్ధి
నతనిమాటచేత లర్థవంతంబులే
యంతరార్థయుక్త మతనిచూపు.

(ఖ) అంతరార్థవంతమై యగాధమగునా
ధ్యాత్మికతయు నొప్పు ధర్మ కర్మ
లాచరించు నెప్పు డవతారపురుషుఁడు
జ్ఞాన వేద్యమతని కార్యఫలము

65. దేవుఁడంచుఁ గొలువు దిట్టమౌ బొమ్మను
బొమ్మ దేవుఁడనుచుఁబూజవద్దు
దైవపదమునకును దగఁజేర్పు మేదైన
దింపకెపుడు బొమ్మ స్థితికి హరిని

66. దైవనామమునకె దైవము వశమౌను
అన్యపద్ధతులకు నధిక ధనము
నకును లొంగఁడెపుడు నారాయణుఁడు నిశ్చ
లమగు ప్రేమ భక్తులతనిఁదెచ్చు



67. (క) అందఁజూడ కెపుడు నానంద శాంతులు
నీకు బాహ్య వస్తు నిచయమందు ;
అందఁగలవు వాని నంతరంగమునందు
నీవు దృష్టి నిలుప నిశ్చలముగ

(ఖ) అటులఁజేయనీకు నానంద శాంతులు
నిత్య సత్యములయి నెమ్మనమునఁ
గలుగఁగలవు తుదకుఁగల్గును ముక్తియు
సత్యసాయి సూక్తి సర్వ హితము

68. (క) చిత్తశీలములును జెన్నుగా భావనల్
నీదు వాక్కు కర్మ నేర్పు తోడఁ
వాని సరణిఁగూర్చి పరిశీలనము చేయు ;
మనసు పిచ్చి కోతి మందలింపు

(ఖ) పైని చెప్పి నట్లు భద్రంబుగాఁ జిత్త
మదుపులోననుంచు మనిశ మీవె ;
అటులఁజేయ నాత్మ మరయఁగలవు సుమ్ము
సత్యసాయి సూక్తి సర్వహితము

69. అజ్ఞుఁడైన వాఁడె యాత్మదే హంబంచుఁ
దలఁచుచుండు నదియుఁ దప్పె సుమ్ము
జనుని యాత్మయొకటి సర్వాత్మలోపల
మనుజ జాతి నొక్క మనుజుఁడతఁడు

70. మైత్రి భయములు నభిమానము నాధార
భూతమైన మైత్రి పొసఁగ దెపుడు
అన్ని వేళల నిను ననుసరించెడి మిత్రుఁ
డతఁడె యీశుఁడయ్య ! యతని నమ్ము

71. సర్వ రక్షక కృప సచ్చి దానందంబు
నీదెస ప్రవహింప నిష్ఠతో, ను
పాస నోపవాస భవ్య కార్యంబులు
చేయ నీశు చెంత చేరఁగలవు

72. (క) దైవమునకు నెంత దగ్గర నుందువో
దైవముండు నంతదగ్గర గను
తలఁతువేని యెపుడు దైవమంతట నుండె
నంచు ; నీదుదరిని నరయు మతని

(ఖ) అట్టి దైవభావమంతటఁగనినచో
నీవు దేవుఁడవని నిక్కముగను
తలఁతు వెపుడు నీకు దైవమునకు
మేమి లేదటంచు మిన్నగాను

73. మాధవుని కరుణయు మానవకృషియును
నేక మైనఁగాని యెట్టి ఫలము
గాంచ లేవు ; దైవకరుణను గాంచుము
భక్తి శ్రద్ధలతనివట్లఁజూపి

74. (క) హృదయపాత్రనుండి యీహేజలంః
నొలకఁబోయుమయ్య యొక్కతడవె
దానినతి పవిత్ర దైవనామస్మర
ణమను తైలపూరితము నొనర్చు

(ఖ) జీవుఁడ నెడియొత్తె చెన్నుగా వైరాగ
మనెడి యెండలోన నారఁబెట్టు ;
కాంతి తోడ వెల్గు జ్ఞానామరజ్యోతి
నరయుమదియె నీదు నాత్మకాంతి.

75. శోచనీయమైన సోమరి తనమును
దుమ్ము తుప్పులవలె దోషయుతము ;
స్వార్థరహితమగుచు చకచక నల్పెడి
పని విరామముఁ దగుననిరి బుధులు

76. ముందు చేయఁగోరి తొందరపడ వ్యర్థ
మగును పని, విచార మందగలవు ;
కాన నిశ్చలత నిదాన మొప్పఁగఁజేయు
పని జయమును గూర్చు పందెమందు.

77. నీదు కోపమెద్దు నీకు శత్రువగును
నీప్రశాంతి కాచు నీకు వజ్ర
కవచమగుచు ; నీవుగనెడి యానందమే
స్వర్గము ; నరకము విచారఫలము.

78. (క) అవనిజనులకెల్ల నాదర్శమూర్తియై
ధర్మరక్షణంబు దాను జేయ
నవతరించినట్టి యవతారపురుషుఁడు
ధర్మబద్ధుఁడగును దనకుఁదానె.



(ఖ) ఘనులు నాయకులును క్రమశిక్షణకు లొంగి
చేసినవి పరులకుఁ జెప్పవలెను
అట్టి వారినెల్ల నవతార పురుషుఁడు
దివ్యశక్తి చూపి తీర్చి దిద్దు.

(గ) సర్వసృష్టికర్త సర్వపోషకుఁడును
సర్వలయమొనర్చు సర్వమయుఁడు
దేవుఁడేర్పరచిన దివ్యసిద్ధాంతముల్
తాను నాచరించుఁ దప్పకొనఁడు.

79. సాటినరుని వట్ల సౌభ్రాత్రమును జూపు
మీశుఁ దండ్రిగాను నెంచు మెపుడు
స్వార్థరహితసేవ సల్పుము ప్రేమతో
నెఱుఁగు మన్నిటఁగల నేకత, మది.

80. తప్పు చేయవచ్చుఁ దప్పని తెలియక ;
తప్పు తెలిసి కొన్నఁ దనకుఁ దానె
మరలఁ జేయరాదు మహిలోన నాతప్పు
సత్యసాయి సూక్తి సర్వహితము.

81. నీదు మాటలందు నీచేతలందును
భావ సరణిలోనఁ బరగనెపుడు
భేదముండరాదు భిన్నత్వ మున్నచోఁ
బరులు మెచ్చరయ్య పరువుపోవు.

82. పాఠశాలలందు బహుకళాశాలల
నిత్యజీవితాన నేర్పుతోడ
'మార్కు' లందు దృష్టి మరలకుండ 'రిమార్కు'
లందకుండునట్టి లక్ష్యముంచు.

83. జన్మభూమి నెపుడు జననిగా భావింపు ;
దేశమాత సేవ్య దీక్షతోడ ;
మాతృదేవి నిల్పె మనసంస్కృతి ననుస
రింపు మొరుల ననుకరింప వలదు.

84. సర్వజగమును నీవె సరిదిద్ది మంచి త్రో
వ నడపుటకు మున్నె వాంఛ నింద్రి
యముల నదిమి నడత నాదర్శముగఁజేసి
కొనుము నీకునీవె ; కోర్కె దీరు.

85. సర్వవేదములును సత్యమే దైవంబ
నుచు వచించె ; సత్యవచనుఁ డవయి
సత్యబద్ధుఁడవయి సత్యమునే పొంద
గలవు బ్రహ్మమరయఁ గలవు నిజము.

86. సర్వనదులుచేరు సాగర గర్భమున్
జీవితంపునదులు చిత్రసృష్టి
మూలమైన బ్రహ్మముననె యైక్యము నొందు ;
నట్టి సంతసమగు నైక్యమొందు.

87. ఏడ్పుతోడఁ బుట్టు నే మానవుండైన ;
నెవని జీవితంబు నేడ్పుతోడ
ముగియరాదు ; జనుఁడు ముగియింపవలె జీవి
తంబు నవ్వుతోడఁ దనకుఁ దానె.

88. జీవితంబు నొసఁగె శ్రీపతి నీకును
దేవు నెట్లొ వెదకి తెలిసి కొనఁగఁ ;
గాన నీభవమునఁ గాంచు మీదేవుని
సత్య సాయిసూక్తి సర్వ హితము.

89. కన్నులీయఁ బడియె ఘున పరమాత్ముని
దివ్య సర్వశక్తి దీప్తిగాంచ
దివిని భువిని దేవ దివ్యత్వమే నిండె
కన్నులార గాంచ వచ్చు మనము.

90. చరణముల నొసంగె సర్వేశ్వరుండును
దివ్యశక్తి యుతుఁడు దేవుఁడున్న
యాలయంబుఁజేరి యతని దర్శింపఁగా
నత్యసాయి సూక్తి సర్వహితము

91. చేతులొసఁగఁబడియెఁ జేయగాఁ బూజను
దైవమునకు నీవు దమము తోడ
మంచి పనులు చేయ మనుజుల ప్రగతికి
నత్యసాయి సూక్తి సర్వహితము

92. శాశ్వతుండెపుడును సర్వేశ్వరుఁడొకఁడె
కంటి కగపడునది కాదు సత్య
మని యెఱుంగుటకయి మహిత బుద్ధి యొసంగ
బడెను నీకుఁగనుము పరమ పదము.



93. నాల్క యీయఁబడియె నారాయణుని గుణ
గణము ఘనత పొగడ జ్ఞానయుతుఁడ !
నమ్రుఁడవయి యతని నామస్మరణచేయు ;
సత్య సాయి సూక్తి సర్వహితము

94. భక్త కోటియెపుడు భగవంతుని శుభనా
మమును రాగతాళమంజులముగ
కీర్తనంబు సేయ ; కీలాలమును గ్రోల
వీను లీయఁబడియె విజ్ఞ ! నీకు

95. తను వొసంగఁబడియెఁ దగఁ బ్రాణికోటిని
నాపద సమయమున నాదు కొనగఁ
బరము కూడఁబొందు భవ్య దేహముతోడ
నత్యసాయి సూక్తి సర్వహితము

96. భువన మంతటికిని మూల మీశ్వరప్రేమ
చిత్త మందుఁ బ్రేమ చెలగనట్టి
పండితుండయినను బరమవివేకియు
వ్యర్థ జీవులంద్రు భవ్యఋషులు

97. (క) ఈశ్వరుండె ప్రేమ యీవు ప్రేమమునందె
స్థిరముగాఁ గడుపుము జీవితంబు
దినము ప్రేమ తోడ దీక్షగా మొదలిడు
నింపు ప్రేమ తోడ నీదు దినము

(ఖ) దినము ప్రేమ తోడ దిట్టవై ముగియింపు
మదియె మంచి పథము హరినిఁ జేరఁ
బ్రేమ మయుఁడు స్వామి ప్రీతితోఁగొలువుము
సత్య సాయి సూక్తి సర్వహితము

98. తల్లి దండ్రులయెడఁదగు ప్రేమ చూపుచు
దైవభావమొప్పఁదగుసు నీకు
వారి సేవనల్పు భగవానుని యనుగ్ర
హం బనిశము పొందు హాయి గాను

99. (క) వివిధగ్రంథములను వేమాఱు చదువుటన్
తలకు నెక్క నట్టి తద్విషయము
జ్ఞానమయిన నీకుఁ గలుగఁ జేయదు మేలు ;
నింపు చిత్తమందు నిండు ప్రేమ

(ఖ) వేదశాస్త్రలబ్ధ విజ్ఞానమెంతైన
శివుని పాదములను జేర్పకున్న
నిష్ప్రయోజనంబె నీకట్టి జ్ఞానం
ప్రేమలభ్యుఁడతఁడు ప్రేమచూపు

100. పాపఫల మొసంగుఁ బరుల కపకృతియె
ఉపకృతిని సలుపుమ యొరుల కెపుడు
దూరముగను బొమ్ము దురితంబు చేయ
ఇదియె వేదశాస్త్ర విధి యెఱుంగు.

101. శక్తి చాలకున్న సాహాయ్య మొనరింప ;
నల్పరాదు హాని ; సాటి వాని
మనసు బాధ చెందు మలిన కృత్యంబుఁ
మానుమింక నైన మనుజుఁడవుగ

102. మరువకీశునెపుడు మనసునందైనను
మృతికి వెఱవకీ వమృతుఁడవగుము
సత్యదేవునందు సాయుజ్య మందెడి
శుభనమయమునకును చూడు మీవె

103. విద్య యొసఁగు చుండు వినయంబు
వినయ మున్నవాఁడె విజయుఁడగును
తగిన వారికడ నుదాత్తవిధేయతల్
చూపఁగాంతు వీవె శుభములెల్ల

104. ఆత్మవిద్య మఱియు నాధ్యాత్మికజ్ఞాన
మున్న వాఁడె పొందు ముక్తి ధ్రువము
పరగ నైక్యమొందఁ బరమాత్మ జీవాత
లాత్మవిద్య నీకు నవసరంబె

105. (క) మార్గదర్శకములు మహనీయ
గ్రంథరాజములును గమ్యమున
గమ్యమునకుఁజేరఁ గనపఱ్చున
అట్టి దారి నేఁగి యాత్మఁగనుమ

(ఖ) అనుభవంబు తెల్పు నాధ్యాత్మిక
మూలముగనె నాఁడు మునులు
నట్టి దారిని జన నానందమును
ముక్తి మార్గగామి ముక్తినొందు



106. అనుభవంబువలన నలవడు జ్ఞానంబు ;
నీదు ననుభవంబు నెఱుఁగఁజెప్పి ;
యన్యులకును నీవె యానందమునుగూర్చు ;
సత్యసాయి సూక్తి సర్వహితము

107. దైవ సూచనలను దప్పక పాటింప
గూఢముగ మదిఁగల గురువు యొక్క
శక్తి మంతమయిన సాక్షాత్కృతిని బొందు ;
నీదు చిత్తమందు నిల్చునతఁడు

108. నీదు హృదయవాసి నిత్యుఁడౌ సాయినే
నిల్పు కొనుము మదిని నిష్ఠతోడ ;
సాయి యొసఁగు నీకు సచ్చిదానందంబు
శాంతి ; ముక్తి నొందు శాశ్వతముగ.

## ఫలశ్రుతి

ఈప్రశాంతి నిలయ మీశ్వర శక్త్యవ
తార సత్యసాయిధామ మిపుడు
అతని సూక్తు లివియె యష్టోత్తర శతంబు
సాధకులకు ముక్తి సాధనములు

సంపూర్ణము

శ్రీసత్యసాయీశ్వరార్పణమస్తు

ఓంతత్సత్



కృతికర్త

## డాక్టర్ ఎం. వి. సత్యనారాయణ

M.A., Ph.D.

నివాసము : విశాఖపట్టణం–3

కృతులు [ అచ్చయినవి ]

శ్రీ వేంకటాచల మాహాత్మ్యము [ తెలుగు వచనము ]

శ్రీ సత్య సాయిశతకము [ ద్వితీయ ముద్రణము ]

&

శ్రీ సత్య సాయి కీర్తనలు ; శ్రీరామశతకము

శ్రీ కృష్ణశతకము ; శ్రీ పాండురంగశతకము

అచ్చుకావలసినవి :

శ్రీ జగన్నాథక్షేత్రమాహాత్మ్యము [ తెలుగువచనము ]

రేడియో ప్రసంగములు ; ఖండకృతులు

ఆంధ్రచ్ఛందో వికాసము

వైదికచ్ఛందో వికాసము

సంస్కృతప్రాకృతచ్ఛందస్సులు

---

ముద్రణ : ఆంధ్రాయూనివర్సిటీ ప్రెస్సు, వాల్తేరు 530 003